# పౌలస్త్య హృదయము



శ్రీ పింగళి లక్ష్మీకాంతము,

కాటూరి వేంకటేశ్వరరావు

[ శ్రీరాముఁడు లంకపై నెత్తివచ్చుట చూచి సముద్రుఁడు రావణునితోఁ జెప్పఁబోగా రావణుఁడనిన మాటలు ]

**1**

నురుఁగుల్ గ్రక్కుచు నూర్పుసందడులు మి
న్నుల్ ముట్ట నొక్కుమ్మడిన్
బరుగుల్ ద్రొక్కుచు శీర్ణ కేశముల ను
ద్బాహుండవై వచ్చు త
త్తఱమున్ గాంచిన నుత్తలంపడెడిఁ జి
త్తం, బీ భయోద్వేగ మె
వ్వరిచే నీ కొనఁగూడె నర్ణవపతీ !
వాక్రుచ్చవయ్యా ! వెసన్

## 2

ఘు)ఘటికామాత్ర)ముచే మూఁడు భువనములకు
విలయము ఘటించు జగదేకవీరుల మాఁట్కు!
నీకు మద్బాహువింశతి, నాకు నీదు
వీచికాకోటి యఁట కోట! వెఱపిఁకేల ?

## 3

నాకు న్నీకు భయం బఁటన్ననుడి యె
న్నండైన విన్నామ ? నేఁ
డీ కంపమ్మునకున్ గతమ్ము కనరా
దే! సుంతయున్ భాస్కరుం
డేకాకారత వెల్గు, వాయువును ము
న్నెట్టట్టులే వీచు, లే
దే కల్పాంతపయోదగర్జ, కనరా
దే తారకల్ రాలుటల్

4

చంద్రహాసము నా చేయి జాఱలేదు
ఔర్వశిఖియు నీ జఠరమం దాఱలేదు
సజ్యకార్ముకుండై రామచంద్రమూర్తి
శింజినీటాంకృతియు నింత సేయలేదు

5

ఎట్లు! చెప్పవు? రాఘవుండే!! - మతేల!
విడువు కంపము, త్రోవ రా విడువు మతని
అనుజసౌమిత్రితోఁ, సూర్యతనయుతోడ,
హనుమతోఁ, దరుచరవరూథినులతోడ

6

ఎన్నాళ్లకు! ఎన్నాళ్ళకు!
కన్నులు వింశతియు నాకుఁ గల్గినఫల మా
సన్నమయి వచ్చె! భుజగ
శ్వోన్నతి చరితార్థ మగు ముహూర్తము వచ్చెన్

7

నాఁటికి నేఁడా ? తలఁపున
నాటెను సామికి విషంరసగరోదితమా
మాటలు, దీర్ఘ విలంబము
నాటించి విభుండు నన్ను వంచించెఁగదే!

8

పాతాలాధిపుతోఁ ద్రొక్కితి, శచీ
ప్రాణేశునైశ్వర్యమ్ము దా
చేతం బట్టితి, వెండికొండ శివుతో
శీతాచలేంద్రాత్మజో
పేతం బల్లలనాడఁ జేసితిఁగదా!
యీ విశ్వవిక్షోభ మే
లా తప్పింపఁడు సామి నన్నెఱిఁగి ? మే
లా నన్ను వంచించుటల్

## 9

"శివకోదండముఁ ద్రుంచె, సీత వరియిం
చెన్ రాముఁ" డన్నప్డె మా
ధవుకార్యం బనుకొంటి, భార్గవభుజా
దర్పాపహారక్రియా
శ్రవణంబున్ సరిదాకఁగా, దినము
వర్షంబైన యుత్కంఠచే
నవివేకమ్మునఁ గన్నుగాన కటు ద్రో
హారంభమున్ జేసితిన్

## 10

"దేవి! జానకీ! యెచటనే దేవి!" యనుచు
దండకాటవి నెల్గెత్తి తరుల గిరుల
నెమకి, మృగముల ఖగముల నిలిపి యడిగి,
యుఱక వాపోయెనఁట! నన్ను మఱచి విభుఁడు

## 11

తమ్ముఁగుఱ్ఱమూపునఁ గేలుఁదమ్మి మోపి
ఉబుకువక్షమ్ము బాష్పమ్ము లొలుకుకనులు
నగుచు నా తండ్రి యాత్రకై నడలు నాఁటి
జాలిచూపు నా మోమున వ్రేలు నేఁడు

## 12

పుడమికానుపు నే నట్లు పుడికి తెచ్చు
టలు జటాయువుచే విని, విలులితాశ్రు
కలుషితకపోలములఁ గెంపుదొలుకఁ గ్రోధ
ముద్రితాననుఁడై రామభద్రమూర్తి
'రావణా!' యని నన్నుఁ, బేర్వాడి ప్రతిన
సలిపినపుడుగదా మనశ్శాంతి దొరకె

13

పదుగురలోన నన్ గుఱుతు
 పట్టునొ, లేదొ యటంచు సర్వభూ
విదితపరాక్రముండ నయి
 వీఱిడిచేతలు పెక్కు చేసితిన్
బదుగురు 'వీఁడు రక్కసుఁ'డ
 నన్ వెడనిందల కగ్గమైతిఁ, దా
మదిమదినుండి నన్ మఱచె
 మాధవుఁ డెంతటి క్రూరచిత్తుఁడో!

14

మునుల హింసించుటలు నాకు మనసొ? సతులఁ
జెఱనిడుట కేను బశువునొ? చెప్పు మీవె!
ఇటులు దాను నృశంసుఁ జేయుటలుగూడఁ
బ్రభునకు వినోదమైన గావచ్చు దాన
జనగవేషణాయాసము దనకు గూర్చు
క్రూరకర్మముమాత్రమే నేర నిజము

ఇంతచేసినఁగాని నా కించు కంత
మంచి దక్కఁగనీఁడాయె మాధవుండు,
సాగరా! ఏమి వచియింతు? జానకమ్మ
తల్లినే హరియింపక తప్పదాయె

16

స్వామిద్రోహముగూడ నేర్పెఁ దుదకున్
వైకుంఠుఁ డోరోర! తా
నేమో నా కిడు బాస లోఁ దలఁపఁడా
యెన్ గుద్దిలోకమ్ము త
న్నే మెచ్చెన్ దొసఁగెల్లఁ జాల్పుదలలన్
నిల్పెన్, మహాంభోనిధి
స్వామీ! మర్త్యుల రాజనీతినిపుణ
త్వం బెల్ల విన్నావుగా

## 17

ఉట్టిగట్టి యిచట నూరేగనుంటినా
యేమి? లోకభీతి యేల నాకు ?
దక్కనిమ్ము మంచితన మెల్ల విభునకే,
అతఁడు న న్నెఱుంగు టదియె చాలు

## 18

ఎల్ల యెఱిఁగియుండి యేమి నెఱుంగని
యట్లు హరి చరించు నప్పుడపుడు,
ఎఱిఁగి యెఱుఁగలేక యే నక్కటా! భూమి
పుత్త్రి నపహరించి మోసపోతి

## 19

ఇంట నున్నయప్పు డీ మాయనటనముల్
లేవు కేశవునకుఁ, గేవలుఁ డయి
దర్శన మ్మొసంగు తండ్రి నే నెఱుఁగనే!
మా యదారి యయ్యె మహికి డిగ్గి

తనదరి కేను రాఁదగిన
దారుల నన్నిటి మూసియుంచినన్
మనమున నోర్చి, నన్ దరియు
మార్గము లన్నిటి విప్పియుంచి, రా
వణభయదాంఘ్రిముద్రి కను
పట్టని సూదిమొనంత నేలయున్
తనకు మిగుల్పనై తినిగ
దా! విభుఁ డేటికి జాగుచేసెనో?

21

కలసకలాఢ్యముల్ మదభి
గాములుగావు పెటింగి భ్రాంతిమై
నిలుచునొ పాలుపోవ కని
నిక్కపుమార్గ మొకండె చేసితిన్,
తొలఁగని రాచబాటగద
తొయ్యలి నేఁ గొనిచన్నదారి, న
న్నలమట బెట్టినన్ విడుతు
నా? తన మాయలు చెల్లనిత్తునా?

22

రావణుఁ డన్నఁ గాళ్ళఁబడు
రాయియు అప్పయుఁ గాదు, జాలమైఁ
గావగ నాఁటి శోఁటియును
గాకియు గ్రిద్దయుఁ గాదు, లోకవి
ద్రావణుఁ డుగ్రవీర చరిత
ప్రథితుం డతిమానియా దశ
గ్రీవుఁడు పోరిలోఁ బొడిచి
గెల్చును జచ్చునుగాక, వేఁడునే ?

23

మాటుము నెచ్చెలీ ! విభునిఁ
జూచితివేకద ! చెప్పు మెట్టు లు
న్నాఁడో రఘూద్వహుండు, లల
నావిరహవ్యథఁ గ్రాఁగి చిక్కియు
న్నాఁడొ? దశాస్యకంఠదళ
నప్రవణాగ్రహవృత్తి వెల్గుచు
న్నాఁడొ? అధిజ్యధన్వుఁ డరు
ణద్యుతిరంజితనేత్రకోణుఁడై

24

వింటిని మారీచునిచే
వింటిని శూర్పణఖచేత, వింటి హనుమచే
వింటిని జనకాత్మజచే
వింటిని రఘువీరు బాహువీర్యకథనముల్

25

పసవల్చు చెక్కిళ్ళ వయసున లజ్జమై
మునియాజ్ఞఁదాటకఁ దునుము సొగసు
జనపాలు వ్రేలు నీడున శైవచాపమ్ము
విఱిచిన శృంగారవీరమహిమ
పసపుబట్టలనిగ్గుపస భార్గవక్రోధ
సంధ్య మాయించిన శౌర్యసార
మాలిఁ బాసిన క్షాత్త్రియులఁతమై వజ్రసా
రుని వాలి నొకకోలఁ దునుము పటిమ
వింటయేకాని—ఇన్నిటికంటె రాచ
పట్టము దొరంగి నారలు గట్టి కాన
మెట్టినట్టి వెక్కసమైన దిట్టతనము
వింటి—సామికే తగు ననుకొంటెకాని,—

26

శ్యామలకాంతిమోహనము,
సౌమ్యగభీరము సుప్రసన్నకే
ళీమృదుహాసభాసురము,
గన్నులపండువునైన రాము నె
మ్మోమును మిమ్ముఁబోలెఁ గన
నోమనుగాదె, కఠోరవృత్తినై
సామిని మున్నె ఘోరరణ
సత్రనిమంత్రితుఁ జేసి యుంచుటన్

27

వినుము, దశకంధరుని విశ్వవిజయకీర్తి
దర్పణంబయి తళతళ త్రుళ్ళి వెలుంగు
చంద్రహాసమె శ్రీరామచంద్రునకును
నాకు ఘటియించుత మిథోవలోకనమ్ము

## 28

తోయధీ! ధన్యుఁడవు నీవు, తొలి మత్స్య
కి మరరూపత నీదె నీ గర్భమున వాగె,
నేఁడు వెండి దఁంపమన్నాఁడ విన్ను,
నెల్లి నినుఁ జేర పవళించు నేమి యెఱుఁగ
నట్టులు తరంగలాలితుం డగుచు శౌరి

## 29

అగుదురు మిమ్ముఁబోంట్లు చరి
తార్థులు, కాదనఁ గాని, మోము ము
ద్దుగొనిన తండ్రికంటె, దయ
తోఁ జను గ్రోల్చిన తల్లికంటె, మై
సగమగు సీతకంటెఁ, బరి
చర్య లొనర్చిన తమ్ముకంటె నీ
జగదభిఘాతి రక్కసుఁగా
సామికి మిక్కిలిం గూర్చు నెచ్చెలీ!

30

తల్లి దండ్రి యాలు దమ్ముంచు మొదలు మీ
కెల్ల లంకె [illegible]
వల్లభునకు నేనె వైదితేఁ [illegible]
కొరు తెలుంగ [illegible]

31

ప్రియదర్శనుఁడైన శ్రీకుల క
భయముద్ర ధరించు సర్వాభద్రుని భయవి
స్మయకారి విలయపరుయా
త్వాయభావం బన్యదుర్లభము నేఁ గందుఁ

32

ఎంచిచూడ జానకి హరియించు టెంత
మంచిపని యయ్యె! స్వాత్మ కిమ్మాడ్కిఁ దొల్లి
ఎవ్వ రపచార మొనరించి? రెవ్వరికిని
దొరకని యగాధతలములు దొరకు నాకు

33

పోరు-లెఱుంగఁడో, దనుజ
పుంగవులన్ మధుకైటభాదులన్
జీరి వధింపఁడో, కిటినృ
సింహముఖాకృతులన్ ధరింపఁడో,
గౌరవ మిట్లొనర్చి దశ
కంఠున కీ పురుషోత్తమాకృతిన్,
శౌరి కపూర్వవిక్రమర
సమ్మునఁ బారణసేయఁగావలెన్

34

పతిభిక్షన్ శచికిచ్చి, గుహ్యకపతిన్
బంధించి, కైలాసప
ర్వతమున్ బోఁ తగలించి, కంఠదళనా
రంభమ్ము చే నీశుఁ ద
ర్పితుఁ గావించినయట్లుగాదు, మురవై
రిన్ శ్రీశు నాత్మేశు న
ర్చితుఁ గావించెడి మేటిపండు విదె వ
చ్చెన్ జంద్రహాసాసిరో!

35

స్వీకృతవీరవ్రతపరి
పాకము, వైరాగ్యభాగ్యఫలసిద్ధి యిదే
నైకరణప్రీణయిని! యెటు
కాకుత్స్థున కాజిభిక్ష కల్పించెదవో!

36

లేదు పతంగవాహనము,
లేవు కరంబులఁ బాంచజన్యకౌ
మోదకులున్, సుదర్శనము
పూనఁడు, రావణు గెల్వవచ్చె దా
మోదరుఁ డెంత నేరుపరి
యో! పదిజంటలచేతులవార! ఆ
కైదువు లాజివేళ హరి
కైకొనుమాడ్కిఁ బరాక్రమింపుఁడీ

37

ఒంటివిలుకాఁ డవై నన్ను నోర్చు తెగువ
వలదురా! రాఘవా! రాఘవా! దశాస్య
నక్కటా! కూర్చిరాక్షసుఁ, స్వాత్మహానన
పాతకుని చేయుటేముగ! ఓ పావమాన!

38

చిరవిరహాగ్నిఁ గ్రాఁగు నడ
చిచ్చులగుండముపోలె బగ్గు బ
గ్గు రనెడి చేతు లిర్వదిటఁ
గూరిచిపట్టి, దశాస్యమండలిన్
దరికొని రావణాగ్ని బహు
ధా దహియింప, నవాంతమందు దా
శరథియొ పంక్తికంధరుఁడొ
శాశ్వతభావము గాంచుఁగావుతన్

పోమ్ము నెచ్చెలి ! రామమూర్తికి నెదురేగి
పుట్టుముత్తియముల మ్రుగ్గు వెట్టి
అత్యున్నతమ్మును నతిగభీరమ్మైన
గర్భపీఠిమతల్లి గద్దె వెట్టి
రమకంటెఁ గౌస్తుభరత్నమ్ముకంటె గా
రామైన మణులు దర్శన మొసంగి
లంకకుఁ బంపు, పౌలస్త్యుండు సిరికోల్వు
చవికయౌ వక్షమ్ము చంద్రహాస

దారిత మొనర్చి, ఆ గంటుదారివెంట
హృదయముఁ జొచ్చి, యేకాంత మిచ్చగించి
స్వాగతముఁ బల్కుమని విన్నపమ్ము సల్పు-
మచటనే పునర్దర్శన మగుత మనకు

